# అయ్యదేవర వారితో శ్రీ దిగవల్లి పరిచయం

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి అస్తమయానికి తన సంతాపాన్ని ప్రకటిస్తూ శ్రీ దిగవల్లి వెంకటశివరావు వ్రాసిన పరిచయ వాక్యాలను ఈ క్రింది ప్రకటిస్తున్నాము.

— ఎడిటర్

"తన అభ్యర్థిత్వాన్ని కేంద్ర ఎన్నికల సంఘం వారు ఖాయపరచిన రాత్రి నుంచే శ్రీ పంతులుగారు ఎన్నికల ప్రచారాన్ని ప్రారంభించారు. ఆ రాత్రి చలిలో తిరిగినందువల్ల ఆయనకు మరునాడు జ్వరం తగిలింది. విశ్రాంతి అవసరమని చెప్పిన డాక్టర్ సలహాను కూడా పాటించక ఆయన వచ్చిన వారితో మాట్లాడుతూనే ఉన్నారు. నేను వెళ్ళినప్పుడు కూడా ఆయన మంచంపై పరుండి నాతో సంభాషించారు.

"శ్రీ కాళేశ్వరరావుగారికి జ్వరం తగ్గినప్పటికీ ఆయన ఊపిరి తిత్తులలో దోషమున్నదని ఆయనకు చికిత్సచేస్తున్న డాక్టర్ బాగంటి సూర్యనారాయణమూర్తి ఒక రోజున నాతో చెప్పారు. మీకు విశ్రాంతి చాలా అవసరం లేకపోతే మానసాందోళన, శరీర పరిశ్రమ ప్రాణాంతకం కాగలవని మేమాయనతో చెప్పాము కాని ఈ పరిస్థితులలో పోటీనుంచి విరమించుకుంటానన్నా మరణించడం మేలని శ్రీ పంతులుగారన్నారు. ఆయన తన ఆరోగ్యాన్ని లక్ష్యపెట్టక రాత్రింబవళ్ళు తిరుగసాగారు. చివరకు వైద్యులు చెప్పినంత అయింది.

"1922 సంవత్సరంలో నేను బెజవాడలో న్యాయవాద వృత్తిలో ప్రవేశించాను. ఆ సమయంలోనే యిళ్ళసన్ను సత్యాగ్రహం చేసి జైలు శిక్షననుభవించి శ్రీ పంతులుగారు విజయవాడకు తిరిగి వచ్చారు. వారికి పురమందిరంలో బ్రహ్మాండమైన సన్మానం జరిగింది.

అప్పటినుంచి మరణించేవరకు ఆయన నాపై పుత్ర వాత్సల్యాన్ని చూపుతూనే ఉన్నారు. ఆయన ప్రోత్సాహం వల్ల నేను దక్షిణాఫ్రికా చరిత్రను వ్రాయగలిగాను. దానిని విజ్ఞాన చంద్రికా గ్రంథమాలలో ప్రకటించారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ఏర్పాటు చేసిన పారిభాషికపదాల గ్లాసరీ కమిటీలో పనిచేయవలసిందని శ్రీ పంతులుగారు నన్ను కోరారు. ఆ కమిటీ కార్యకలాపాల విషయంలో నేను కొన్ని సందర్భాలలో పంతులుగారితో వివాదాలు పెట్టుకునేవాడిని. నేను అసంతృప్తితో ఇంటికి వెళ్ళిపోయినప్పుడు ఆ సాయంకాలమే ఆయన నా దగ్గరకువచ్చి సమాధానపరచి కమిటీ కార్యకలాపాలు కొనసాగేటట్టు చూశారు.

"ఆయన స్థాపించిన చరిత్ర, శాస్త్రవిజ్ఞాన అకాడమీలో, చరిత్రశాఖ సంపాదకవర్గము౦దు నన్ను నియమించి, ఆఫ్రికా జాతీయోద్యమ చరిత్ర రచనకు ప్రోత్సహించారు.

"అకాడమీ ప్రారంభోత్సవ సమయంలో శ్రీ పంతులుగారు నన్ను రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌కు ఇతడే ఆఫ్రికా జాతీయోద్యమ గ్రంథకర్తయని పరిచయం చేశారు.

"నా జీవితం, నవ్యాంధ్రం" అను పేరుతో రచించిన స్వీయచరిత్రలో శ్రీ పంతులుగారు నన్ను గురించి కొన్ని పుటలు వ్రాసి ప్రశంసించారు. ఆయన త్యాగనిరతి, అదరాభిమానాలు మరువలేనివి. ఆయన నిగర్వి, దయాళువు."

ఆంధ్రజ్యోతి 27.2.1962.

nd Five Year Plan is directe
conditions for industrial
recognized that further stre
nental services in the labou
hemes to encourage the im
ucation and apprenticeship pr
courage the building of h
trained labour leaders, and t
rammes for workers.